## కృతి

గీ. తల్లికన్నను దైవంబు దలఁప లేదు
నన్నుఁ గన్నట్టి తల్లికి నయము మీఱ
రామమాంబార్పణం బని రహిఁ జెలంగఁ
గృతిగ శతకంబు నిచ్చితిఁ గేలుమోడ్చి.

సీ. ఉప్పర్ల గోత్రజుం ♦ డుత్తమశీలుండు
మాశినవంశాబ్ధి ♦ మహితవిధుఁడు
చినరామయాఖ్యుండు ♦ శ్రీమీఱ వేంకమ
యందు ముఫ్వురఁ బ్రీతిఁ ♦ బొందె సుతుల
సత్యనారాయణ ♦ సరవిని సూరన్న
వేంకటరాజుల ♦ వేడ్క మీఱ
ననుజవాత్సల్యంబు ♦ నినుమడింపఁగ వారు
దేవ బ్రాహ్మణభక్తి ♦ దేజరిల్ల

వృద్ధినొందుచు నుండిరి ♦ వీరియందు
రామభక్తుండు వేంకట ♦ రాజు శతక
మచ్చువేయింప విత్తము ♦ నిచ్చె భక్తి
నతనిఁ బ్రోచుత మీశ్వరుం ♦ డవని నెపుడు.



శ్రీమహాలింగేశ్వరాయనమః

# హరశతకము

## ఇష్టదేవతాదిస్తుతి

క. రాముఁడు మునిజనమానస
రాముఁడు లోకైకరక్ష ♦ రాముఁడు భువిలో
రాముఁడు భక్తుల సురభియు
రాముఁడు పరమాత్మ యనుచు ♦ రహిఁ దలఁతు హరా.

క. రవిమండలమధ్యస్థితుఁ
డవికారుఁడు నాదిపురుషుఁ ♦ డార్తిహరుండున్
భువి హైరణ్మయవపుఁ డని
యవిరతి దీపించుపురుషు ♦ నర్చింతు హరా. 2

క. కరపద్మంబున లీలఁగ
వరలెడి పదసారసంబుఁ ♦ బట్టుచు దానిన్
సరసీరుహాననంబునఁ
బరపెడి వటపత్రశయను ♦ భావింతు హరా. 3

క. ఇల మేడపాడ్పురంబున
లలితమహాలింగదేవ ♦ ళంబున నిన్నున్

వెలయఁగ నిలిపిన జనకుని
నల పెండ్యాల వెంకయాఖ్యు • నర్చింతు హరా. 4

క. నరసాపురపేఁటను భవ
పరముగ దేవళము గట్టి • వరతపసిగఁ దా
వరలిన రామయశాస్త్రిని
ధరఁ బినతండ్రిని దలంతు • ధవళాంగ హరా. 5

క. పెదవేంకట చినవేంకట
ఫదసుబ్రహ్మణ్యు లోఁగని • బండితవర్యుల్
ముదమున సోదరులై రిల
నెద వారల మ్రొక్కుచుందు • నేత్రాక్ష హరా. 6

—• భక్తి •—

క. శ్రీరామనామమహిమను
సారెకు వర్ణింప వినఁగ • శర్వాణి భవుం
గోరిన నర్ధాంగంబునఁ
జేరిచి యుపదేశ మిచ్చు • శితికంఠ హరా. 7

క. నీనామమహిమ మెట్టిదొ
కానల వసియించు సర్వ • కర్మత్యాగుల్
పూనికలు నెఱపి యమృతపు
మానసులై వెలసి రయ్య • మహాదేవ హరా. 8

క. సవనములు వేయి జరిపియు
శ్రవణంబులుఁ జేసినైన • గానతుసుమ్మీ

శివ శివ శివ శివ యనినఁ
భవసాగర మీఁది ముక్తిఁ ♦ బడయుదురు హరా. 9

క. తొలిజన్మమందుఁ జేసిన
విలసితపూజావిశేష♦విధి దీర్ఘంగా
గలుగును నీపై భక్తియుఁ
గలిమియు సంపదయు ముక్తి ♦ గరళాంగ హరా. 10

క. బీదలు సాదలు ననఁగా
భేదం బించుకయు లేక ♦ పృథ్వీస్థలిలో
సాదరమున రక్షించెడి
వేదండవపుఃప్రధారి ♦ విశ్వేశ హరా. 11

క. హర యను నక్షరయుగమును
స్మరియించినఁ బాపచయము ♦ సమయుట యరుదే
హర యని మననముఁ జేసిన
హరిపదసాన్నిధ్యసౌఖ్య ♦ మందుదురు హరా. 12

క. నీపదయుగసంసేవయు
నీపదసేవకులతోడి♦నెయ్యము భువిలో
తాపసులసేవ నిరతము
ప్రాపుగ నా కొసఁగి కరుణఁ ♦ బాలింపు హరా. 13

క. తెలిసియుఁ దెలియకఁ జేసిన
పలుదెఱఁగులదోసఁగు లెల్లఁ ♦ బాసి చనంగా

వెలలేని నీదునామము
దలఁచినమాత్రాన ధన్య♦తముఁడౌను హరా. 14

—♦ రుద్రోత్పత్తికథావిశేషము ♦—

క. కోపరస ముప్పతిల్లఁగ
నేపునఁ బరమేష్ఠినొసట ♦ నీశ్వరుఁడ వనన్
రూపవతి గౌరితోడను
తాపసమందార! పుట్టి ♦ ధవుఁడైతి హరా. 15

క. పుట్టినవాఁడ వటుండక
నెట్టన నీవంటివారి ♦ నేర్పడ నీవే
పుట్టింప రుద్రులై రిల
కట్టడి గల ప్రభుఁడ వీవు ♦ గళగరళ హరా. 16

క. జగతికి నీవే తండ్రివి
వగ దీర్పఁగఁ దల్లి గౌరి ♦ పాలింతురు మీ
యుగమును బూజించెద నా
దగుభవకూపంబు వెడల ♦ దయఁజూడు హరా. 17

క. నీమహిమ గనని మనుజుఁడు
క్షేమంబును బొందఁ డెపుడు ♦ క్షితితలమందున్
సామి వని నిన్ను నమ్మితి
కామితములు దీర్పుమయ్య ♦ గరళాంక హరా. 18

క. దక్షుఁడు నీపై వైరము
దక్షతఁ బూనంగ నీవు ♦ దనయునిచేతన్

శిక్షింపఁ జేసి వెలసిన
దక్షుఁడ విటువంటి శూర♦తముఁ డేఁడీ హరా. 19

క. విజయుండు పాశుపతమును
విజయంబును గోరి నిన్ను ♦ వేఁడుకొనంగా
నిజమగు ప్రేమ నొసంగితి
వజునకు సాధ్యంబు గాని♦యస్త్ర మని హరా. 20

క. నిను భజియించెడి మనుజుఁడు
ఘనకీర్తియుఁ గాంతిదాంతి ♦ కైవల్యంబుల్
అనయముఁ బొందును శాత్వా
యనిమానసహరణ పోవు ♦ మర్థింతు హరా. 21

క. గజుఁడను రక్కసుఁ డెలమిని
విజయత్వము భక్తి గదుర ♦ వేఁడుకొనఁగ నా
గజు హృదయంబును జొచ్చితి
వజసురమునివందితాత్మ ♦ యఖిలేశ హరా. 22

క. సకలము నీవై యుంటివి
యకలంకగుణాఢ్య వరద♦యానందమయా
నికటమునఁ జేరఁదీయుము
సకలేశ్వర వేఁడుచుంటి ♦ సర్వాత్మ హరా. 23

క. అగణితచర్యలు నీ వని
ఖగవాహనుఁ డాదిగాఁగ ♦ ఘను లేర్పడ నీ

దనుచారిత్రము విరివిగఁ
బొగడుచు నినుఁ దెల్పి రవని ♦ భూతేశ హరా. 24

క. పాపముల నెన్నొ చేసితి
రూపింపఁగఁజాలఁ గర్మ♦లోలుఁడ నెపుడున్
పాపింపించియుండె మృత్యువు
కోపింపక సేవ నొసఁగు ♦ గొబ్బునను హరా. 25

క. తనబిడ్డలఁ దగ జనకుఁడు
ననువొప్పఁగఁ బెంచురీతి ♦ నతికుశలుఁడవై
వినమితవితతిని గాచెడి
ఘనుఁడవు వృషభాంక గగన♦కౌశేయ హరా. 26

క. సత్యము శాంతియుఁ దప మని
నిత్యము బోధించి ప్రజల ♦ నేర్పున నడుపన్
సత్యమగుమార్గ మెఱిఁగితి
నిత్యుఁడ వగు కల్కిరూప ♦ నిఖిలేశ హరా. 27

క. హరిహరులు బ్రహ్మదేవుఁడు
నరయఁగ నొకఁడాను గాక ♦ యన్యం బగునా
కరఘటభేదము లుండియు
సరసి జలమ్మొక్కటైన♦చందమున హరా. 28

క. అన్యము చింతింపక మది
ధన్యుఁడ నని యెపుడు నిన్నుఁ ♦ దలఁచి జపింపన్

పుణ్యుఁడగు వాని నెప్పుడు
హైన్యము లేకుండఁ జూచు ♦ హరిమణాళిహరా. 29

క. గర్వితదానవఖండన
పర్వతరాజేంద్రనిలయ ♦ పావనరూపా
దర్వీకరవరభూషిత
సర్వోత్తమ కావుమయ్య ♦ సకలేశ హరా. 30

క. గంగాభంగపుఁదరఁగల
సంగతవరమౌళివేష ♦ సర్వాత్మ శివా
సంగీతలోల కావుమ
అంగజమదభంగ లింగ ♦ యఖిలేశ హరా. 31

క. దేవాసురగంధర్వులు
తావకపదపద్మయుగము ♦ దలఁచినయంతన్
దేవీసహితుఁడవై దయఁ
బ్రోవంగా లేదె వారిఁ ♦ బురవైరి హరా. 32

క. సర్వము నీవై యుంటివి
సర్వము నినుఁ జూచుచుండె ♦ సర్వము నీవున్
శర్వా చూచుచు నుందువు
దర్వీకరభూషితాంగ ♦ దనుజారి హరా. 33

క. అతిఘోర మైనభవమున
పతితుఁడ నై మతినిదప్పి ♦ పాపపుఁ జేష్టల్

గతిఁ దెలియక చేసితి నే
బతిమాలితిఁ గావుమయ్య ♦ ప్రమథేశ హరా. 34

క. శాశ్వతుఁడై యుండిన హరి
సూర్యుఁడు జలపాత్రలందుఁ ♦ దనరెడిరీతిన్
విశ్వము వర్తింపఁగ హరి
విశ్వేశుం డజుఁడ వగుచు ♦ వెలసితివి హరా. 35

క. పరమేశ నీవు ప్రకృతికిఁ
బరుఁడ వటం చెఱిఁగి నిన్ను ♦ భజియింపంగా
సురుచిరరూపముఁ దాలిచి
వరదుఁడవై గాతు వెపుడు ♦ భవనాశ హరా. 36

క. నరజన్మ కష్టతమ మని
పురుషార్థం బెఱిఁగి నీదు ♦ పూజ యొనర్పన్
దిరమగు మోక్షము దొరకును
సురవరవినుతాంఘ్రిపద్మ ♦ శుభనామ హరా. 37

క. తనువునఁ బుట్టినశత్రువు
లనురాగముఁ జూపి పిదప ♦ నద్భుతరీతిన్
బెనుబాధల నొందించును
ననుఁ గావు దయార్ద్రదృష్టి ♦ నగవాస హరా. 38

క. ఎప్పుడొ యేవేళనొ విధి
దప్పదు జీవులకుఁ జావు ♦ తఱి దెలియదు నీ

విప్పుడె సేవ యొసంగుము
ముప్పున రోగములు చేరు ♦ భూతేశ హారా. 49

క. ఆలియు బిడ్డలు బంధులుఁ
జాలఁగ మిత్రులును జేరి ♦ చనువేళ ననున్
గాలుని కర్పణచేతురు
కాలాంతకముక్తి నొసఁగి ♦ కరుణింపు హారా. 40

క. *త్రిగుణయుతదోషకలనఁ
సగుణుని నినుఁ జూడ నీక ♦ చనిపోవుడి వేళఁ
వగలను బడి చెడనీయక
తగుసేవ యొసంగి నన్ను ♦ దయఁజూడు హారా. 41

క. సాగెడిప్రారబ్ధంబును
వేగిరపడి యనుభవింతు ♦ విధి యగుటను నేఁ
డాగామిసంచితంబుల
నేఁ గానఁగనీక కావు ♦ మీశాన హారా. 42

క. సూర్యోదయాస్తమయము ల
వార్యతఁ గడతేర్చు నాయు♦వని యెఱుగక నే
కార్యములఁ దగులఁ గాలము
క్రౌర్యముఁ జూపింపఁ జేరుఁ ♦ గరుణింపు హారా. 43

క. పరమేశ ! నిన్నుఁ గనుఁగొన
సరసీరుహాభవునికైన ♦ శక్యమె తలఁపన్

---

* వాతపిత్తశ్లేష్మములు.

క్రోధంబె వాఁడిఖడ్గము
క్రోధంబునఁ జెడును మనుజ ♦ కోరికలు హరా. 54

క. మహిమ గల నదులఁ బూడిచి
బహుళభంగుల యతులఁ జంపి ♦ పడఁతులఁ జెఱలోఁ
గుహకమతి బాధపెట్టిన
నిహపరములఁ గోలుపోదు ♦ రెవ్వరైన హరా. 55

క. మధుశాలల నిత్యము గో
వధశాలల జంతుహింస ♦ పరికింపంగా
నధమ మగు పాపహేతువు
విధిగాఁ బ్రజ నంటి మిగుల ♦ వేధించు హరా. 56

క. కడుపునఁ బుట్టిన బిడ్డకు
గడు ముదమునఁ బెండ్లిసేయఁ♦గా దని శాసిం
చెడిశాసనంబు లిప్పుడు
కడుఁ గష్టము లొందఁజేయు ♦ గరళాంక హరా. 57

క. స్నానము సంధ్యయు జపమును
గానము హోమంబు వేద♦గానము నెచటన్
గానము ధర్మము చెడి భువి
వానలు లేకుండె కఱవు ♦ బరువయ్యె హరా. 58

క. తల్లిని దూఱుట దల యిల
పెల్లునఁ బగులంగఁగొట్టు ♦ భీకరుఁ డిలలోఁ

గల్లలు పన్నుచుఁ బల్కెడి
యిల్లాలిని నమ్మి చెనఁటి ♦ యేలుగును హరా. 59

క. జనకుఁడె జన్మకుఁ గారణ
మని యెఱిఁగియుఁ గ్రూరుఁ డగుచు ♦ నంతకుఁ జేర౯
ఘనముష్టి నడఁచుఁ జూచెడి
చెనఁటులు గలరయ్య భువిని ♦ శితికంఠహరా. 60

క. సతిమాట కూడు గుడ్డయు
సతిపలుకులె యమృతబిందు ♦ సమమై తనకున్
సతియే గతి యని తలఁచెడి
మతిహీనుఁడు చెందును సుగతి ♦ మహాదేవ హరా. 61

క. పెద్దలఁ బిన్నలఁ జూడక
గద్దఱికముఁ బూని గాలి ♦ గాఁడులమాడ్కిన్
బుద్ధి చెడు పాటఁ బాడెడి
ముద్దియలే పెద్దలైరి ♦ పురవైరి హరా. 62

క. చెప్పెడుమాటలు సతికిన్
జెప్పనిమాటలును గలవు ♦ చెనఁటులు ప్రేమన్
గొప్ప యని చెప్ప రచ్చల
కప్పుడె యది చేర మప్పె ♦ యగు నెపుడు హరా. 63

క. కుజనునియధికారంబున
సుజనుల కతికష్ట మగుట ♦ చోద్యం బెటులో

నిజమగు నుపవాసంబున
భుజియింపదె జంతువితతిఁ ♦ బులి మించి హరా. 64

క. పడఁతిని ధనమును మనుజుఁడు
పడయుట కై యెప్పుడు శుద్ధిఁ ♦ బాటింపవలెన్
తడుమక పొందిన నిరయముఁ
బడి బాధల నొందుచుండుఁ ♦ బరమేశ హరా. 65

క. లోభమువలన నె క్రోధము
లోభంబునఁ గామ మొదవు ♦ లోభమె రిపుఁడౌ
లోభమునఁ గార్యనాశము
లోభమె పాపములపాదు ♦ రుద్రేశ హరా. 66

క. గురునకు మించిన తాతయు
నరయఁగ బోధనకు మించు ♦ నతిసౌఖ్యంబున్
ధరఁ దల్లి కెనయు దైవముఁ
బరికింపఁగ లేరు ధరణిఁ ♦ బ్రమథేశ హరా. 67

క. పావకసదృశులు పడఁతులు
భావింపఁగఁ బురుషుఁ డాజ్య ♦ పాత్రి దలంపన్
గావునఁ బరవనితలఁ నెద
భావింపక మనుజుఁ డున్న ♦ భవుఁ జేరు హరా. 68

క. అవినీతులక్ష్మి నిరతము
భువి నిలువదు తథ్య మరయ ♦ ముదముననఁ గపికిన్

కువలములహార మిడ మెడ
నవలీలఁగ నపుడె తెగ్రించు ♦ నటువలెనె హరా. 69

క. అస్థిరము లాలుబిడ్డలు
నస్థిరమగు యౌవనంబు ♦ నధికారంబున్
అస్థిరము జీవితంబును
సుస్థిరమై యుండుఁ గీర్తి ♦ శూలాంక హరా. 70

క. సాధులసత్పురుషుల నిల
బాధించెడి పాతకులను ♦ బాయక యెపుడున్
క్రోధంబున శమనుని భట
యూథంబులు నరక బాధ ♦ నొందించు హరా. 71

క. గోవులె ప్రజలకు రక్షణ
గోవులె సకలార్థములును ♦ గోత్రిమె గోవా
గోవులకుఁ బూజచేసిన
గోవులలోకంబు గల్గు ♦ గోనాథ హరా. 72

క. శివపూజమోక్షదం బని
భవబాధలు దీరి ముక్తిఁ ♦ బడయుట కిలలో
శివరూప మనుచు శిలలను
యెవనిని బూజించి కోర్కు ♦ లందెదరు హరా. 73

క. తఱచుగ జీవులు కాలుని
పురమున కేగుటలు చూచి ♦ పురుషుం డిళ్లలోఁ

దిరముగ బ్రతికెద ననుకొని
చరియించుట వింతగాదె • సర్వేశ హరా. 74

క. సుఖమును దుఃఖము నిడుటకు
సఖులును బంధువులె గాదు • సరసిజభవుఁడున్
నిఖిలేశ యీయఁజాలరు
అఖిలము దనకర్మఫలన • నగుచుండు హరా. 75

క. త్రివిధంబు లాత్మరూపము
లవి యాత్మపరాత్మ యనగ • ననయము పరమై
సువిచారజ్ఞుల కెఱుకై
తివిరెడిపరమాత్మ యనుచు • దీపించు హరా. 76

క. మమతాహంకారంబులు
క్రమముగఁ గర్తృత్వ మొంది • గ్రైవేయంబై
భ్రమ జెందఁ జేయుచుండును
కుమతులకెఱవైన యాత్మ • కొండాడి హరా. 77

క. జడదుఃఖావృతచేష్టలఁ
జెడి నీరసమై యనాత్మ • చేడ్పడియుండున్
విడువక సత్యము జ్ఞానము
నడలక యానంద మాత్మ • సతముండు హరా. 78

క. ఆకాశము జలమునఁ బడ
నాకాశమె భిత్తియందు • నలరినభంగిన్

ప్రాకటముగఁ బరమాత్మయు
నేకంబై త్రివిధమయ్యె ♦ నీశాన హరా. 79

క. పరమాత్మ యేకమయ్యును
ఉరుతర మాభాస మొంది ♦ యుపసర్పణచేఁ
పొరపులు గల్గఁగ జీవుఁడు
నిరతిని బొందంగ లేఁడు ♦ నిఖిలేశ హరా. 80

క. జీవుని చరితము దెలియక
దేవా నీయందు గుణము ♦ దేటపఱచువాఁ
డేవగనైనను బొందును
పావనజనకల్పభూజ ♦ పరమేశ హరా. 81

క. సుజనుల సేవయు శ్రీహరి
భజనయు వేదాంతగ్రంథ ♦ పఠనత్వంబుల్
నిజముగు నైశ్యాసక్తిని
బ్రిజనెల్లను బొందఁజేయుఁ ♦ బ్రిమథేశ హరా. 82

క. మనమే బంధము మోక్షము
మనమే సకలార్థములును ♦ మనమే విధుల్
మనమే జన్మకుఁ గర్తయు
మనమే విశ్వంబటంచు మనవలెను హరా. 83

క. నిత్యము సన్నిహితంబయి
మృత్యువు తనవెంట నంటి ♦ మఱి దీఱంగా

బ్రాహ్మణ యగుచుఁ జంపును
సత్యం బిది యేరికైన ♦ సర్వేశ హరా. 84

క. పండితవిప్రుల గోవుల
వెండియు శుని హస్తి శ్వపచ♦వితతులఁ బ్రీతిన్
బండితుఁడు చూచు సమముగ
నిండినచిత్తంబు గదుర ♦ నిఖిలేశ హరా. 85

క. *ఆఱింటిఁ జంపి మూఁటిని
వేఱుగ విషునటులఁ జేసి ♦ విచ్ఛేదముగా
నా రెంటి నడఁచి యొకటిని
జేరిచి రక్షింపు మయ్య ♦ శ్రీకంఠ హరా. 86

క. ♦భేదించి యాఱు నైదును
భేదింపుచు నాల్గుమూఁడు ♦ ప్రీతిని రెండుఁ
సాధింపఁజేసి యొకటిని
జేదండగఁ జేయుమయ్య ♦ శితికంఠ హరా. 87

క. చూచెడివాఁడును జూపును
జూచెడివిషయంబు మూఁటిఁ ♦ జోర వడి మూఁటిం
దోఁచని వైలక్షణ్యముఁ
జూచెడి పరమాత్మ యంద్రు శూలాంక హరా. 88

---

* 6 అరిషడ్వర్గములు, 3 ఈషణత్రయములు, 4 అహంకారాదులు, 1 పరమాత్మ.

♦ 6 ఊర్ములు. 5 పంచకోశములు, 4 మనోబుద్ధ్యాదులు, 3 గుణములు, 2 జీవాత్మలు, 1 పరమాత్మ.

క. ఒకదానినుండి చిత్తం
బొకదానికిఁ జెందు మధ్య ♦ నుండెడి ఛాయే
వికలత్వ ముండ నేరని
సకలాత్ముని రూప ముద్రడు ♦ సర్వాత్మ హరా. 89

క. పుడమిని జాగ్రత్స్వప్నము
కడమదగు సుషుప్త్యవస్థ ♦ గానక యెపుడున్
జడతయుఁ జేతనఁ బొందక
కడిపోవని నీరు రూపు ♦ గలిగించు హరా. 90

క. పరమాత్మవలన మనమును
నరయఁగ నామనము వికృతి ♦ నఖిలజగంబుల్
నిరతముఁ బుట్టించును నం
బరమున లేనట్టి నలుపు ♦ బఱపుగతి హరా. 91

క. సంకల్ప ముడుగ మనమున
శంకలు లేకుండ పీడు ♦ సంసారంబున్
అంకిలి పోవఁగఁ దనలో
గొంకక పరమాత్మ వెలుఁగు ♦ గొలుమ్మాసి హరా. 92

క. పాపమున కలుకువాఁడున్
ప్రాపించినదాని నొందు ♦ పరమప్రియుఁడున్
శ్రీపతి నెప్పుడుఁ దలఁచెడి
యాపురుషుఁడె బ్రహ్మనిష్ఠుఁ ♦ డగు నెపుడు హరా. 93

క. నిత్యునిఁ జెందుటకై నరుఁ
డత్యుత్తమవేదకర్మ ♦ నలరుచుఁ జేయున్
సత్యమగు చిత్తశుద్ధియుఁ
బ్రత్యయమును బొంది చేరుఁ ♦ బరమేశు హరా. 94

క. వర్ణాశ్రమధర్మంబుల
నిర్ణయమగు క్రతువు లాది ♦ నియతక్రియలన్
పూర్ణీభవించుచిత్తము
తూర్ణంబుగ ముక్తి దొరకు ♦ దుర్గేశహరా. 95

క. *నవిసంజ్ఞ లైన కర్మలు
కవలౌ; బహుసౌఖ్య మిడు స♦కర్మం బెపుడున్
సువికర్మ ముక్తి నొసగును
ఇవివేత్త తెలింగిసేయు ♦ నింపొందు హరా. 96

క. సన్యస్తకర్మయోగము
ధన్యత నొందించు మనుజుఁ♦దగుకర్మలచే
విన్యస్తమైన చిత్తం
బన్యముఁ గోరకయె బ్రహ్మ♦మందు భువి హరా. 97

క. గురువులయుపదేశంబున
నరయుఁగ నభ్యాసయోగ ♦ మలవడ నేర్చిన్
పరమానందము నొందుచుఁ
దిరముగ బ్రహ్మత్వ మొంది ♦ దీపించు హరా. 98

* సకర్మ, వికర్మ అనుకర్మలు.

క. ఇనఘృణియోంకారంబును
ఘనభూతచయంబు మఱియు ♦ ఘనబాలబలం
బెనయఁగ నీరూపంబులె
యని యెఱిఁగిన బ్రహ్మ మొందు ♦ నహింహార హారా. 99

క. వేదమునఁ జెప్పుకర్మలు
నాదరమున విడువ కెపుడు ♦ నలరుచుఁ జేయన్
భేదంబు లేక శ్రీహరి
మోదంబునఁ దన్నుఁ జేర్చు ♦ భూతేశ హరా. 100

క. పరమాత్మతత్త్వ మెఱిఁగిన
నరయంగాఁ బ్రకృతిరూప ♦ మైనయవిద్యన్
దరిఁ జేరనీక మనుజుఁడు
ధరజీవన్ముక్తుఁ డగుట ♦ తథ్యంబు హరా. 101

క. సర్వప్రాణుల నాహరి
నిర్వాహముచేత నడుపు ♦ నిఖిలము హరిగా
నుర్విపయి నెవ్వఁడెఱుఁగును
సర్వేశ్వరుఁ జేరు నతఁడు ♦ సర్వాత్మ హరా. 102

క. బెదరిన కృష్ణునిఁ గృష్ణుఁడు
సదయతఁ దనవిశ్వరూప ♦ సందర్శమునన్
విదితముగఁ దనదుతత్త్వము
ముదమున నెఱిఁగించి ముక్తిఁ ♦ బొందించె హరా. 103

క. సగుణముగ నిర్గుణంబుగఁ
దగుగురునుపదేశ మంది ♦ తలరనిభక్తిన్
నిగమాంతవేద్యుఁ గొలిచిన
బాగడొందుచు ముక్తి నొందుఁ ♦ బురవైరి హరా. 104

క. పురుషుఁడుఁ బ్రకృతియు నొకటగు
పెరయని తలపంగవలదు ♦ పృథ్వీస్థలిలోఁ
ఖరకరుఁడు కరము లొకటయి
వరలెడివిధమున నె యుండుఁ ♦ బరమాత్మ హరా. 105

క. రాజసతామసగుణముల
నోజన నశియింపఁ జేసి ♦ యుపసర్పణచే
పూజింపఁబడెడిసత్వపుఁ
దేజంబును బొందునరుడు ♦ దీపించు హరా. 106

క. భవకుజమూలం బాత్మగ
భువి మానవుఁ డెఱిఁగి గురుని ♦ బోధనచే నా
సువిరాగఖడ్గధారను
*చివుకగుభూజంబు నఱకఁ ♦ జేరు నిను హరా. 107

క. దేవాసురసంపద లిల
భావాదులవలనఁ గల్గుఁ ♦ బరమేశ్వరునిన్
సేవ్యమగు వేదధర్మము
దేవత్వము నొసగ నరుఁడు ♦ దీపించు హరా. 108

* చివుకగు=సారహీనమగు.

క. రాజసతామససత్త్వము
లీజగమున మనుజకర్మ • నేర్పఱుచుఁగావిూ
భోజనము దెచ్చు గుణముల
నోజిన సాత్త్వికపుభోక్త • లుత్తములు హరా. 109

క. ఫలమును గోరక కర్మను
సలుపంగావలయుఁ గామ • సాదులగుణముల్
దెలిసికొని సాత్త్వికంబున
వెలసినమనుజుండు ముక్తి • వేపొందు హరా. 110

క. నారాయణపదభక్తుఁడు
పారుఁడు పెండ్యాలవంశ • పావనుఁడు భువిన్
కూరిమి వేంకయసూనుఁడు
నారాయణశర్మ జెప్పె • నతి దీని హరా. 111

శ్రీమహాలింగేశ్వరార్పణమస్తు.

